# పాశుపత మంత్ర ప్రయోగము

శివ ఆరాధనలలో అత్యంత క్లిష్టమైనది, ప్రత్యక్ష ఫలదాయకమైనది ఈ పాశుపత మంత్రము. పూర్వ కాలములో అర్జునునికి కృష్ణుని ద్వారా ఈ పాశుపత మంత్ర విధానము బోధించబడినది. అర్జునుడు దీని ద్వారా శత్రుంజయమైన పాశుపతాస్త్రాన్ని పొందాడు.

పాశుపతము రుద్ర సంపుటి ద్వారా చేయవలయును. రుద్రమునందలి 169 మంత్రములతో మనకు కావలసిన మంత్రమును సంపుటీకరించి శివునికి అభిషేకం చేయాలి. ఉదాహరణకు ఆరోగ్యాన్ని, ఆయుర్వృద్ధిని ఇచ్చే అమృత పాశుపతమును చేస్తున్నప్పుడు ముందుగా పాశుపత మంత్రమును చెప్పాలి.

**ఓం హౌం ఓం జూం ఓం సః ఓం భూః ఓం భువః ఓం స్వః**

**ఓం త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనం ।**
**ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయమామృతాత్ ॥**

**ఓం స్వః ఓం భువః ఓం భూః ఓం సః ఓం జూం ఓం హౌం ఓం స్వాహా।**

ఇది సంపుటి చేయవలసిన మంత్రం.

ఈ మంత్రం చెప్పాక రుద్రం లోని ఒక మంత్రం చెప్పాలి.
ఆ తర్వాత మళ్లీ త్ర్యంబకం చెప్పాలి.
ఆ తర్వాత మళ్లీ త్ర్యంబకం చెప్పి రుద్రంలోని తర్వాతి మంత్రాన్ని చెప్పాలి.

ఇలా 169 రుద్ర మంత్రములను సంపుటీకరిస్తే అది ఒక పాశుపతం అవుతుంది. ఇది గురుముఖతః నేర్చుకొని, మంచి అనుభవజ్ఞులతో చేయించుకొన్నచో మంచి ఫలితములను ఇస్తుంది.

ఈ పాశుపత మంత్రములు ప్రధానముగా 14 రకములు.

1. మహా పాశుపతము
2. మహాపాశుపతాస్త్ర మంత్రము
3. త్రిశూల పాశుపతము
4. అఘోర పాశుపతము
5. నవగ్రహ పాశుపతము
6. కౌబేర పాశుపతము
7. మన్యు పాశుపతము
8. కన్యా పాశుపతము
9. వరపాశుపతము
10. ఋణ విమోచన పాశుపతము
11. సంతాన పాశుపతము
12. ఇంద్రాక్షీ పాశుపతము
13. వర్ష పాశుపతము
14. అమృత పాశుపతము

## విధానము:

### 1. మహాపాశుపతము: Maha Pashupatam (For removing hurdles)

**మంత్రము: నమశ్శంభవేచ మయోభవేచ నమశ్శంకరాయచ మయస్కరాయచ నమశ్శివాయచ శివతరాయచ॥**

ఈ మంత్రమును 169 రుద్రమంత్రములతో సంపుటీకరించి శివునికి అభిషేకించాలి.

అభిషేక ద్రవ్యములు: పంచామృతములు మరియు ఇతర అభిషేక ద్రవ్యములు.

ఫలము: ఈ మహా పాశుపత మంత్ర రాజముతో సమానమగు మంత్రము ముల్లోకములలో ఎక్కడను లేదు. దీని వలన రాజ్యాధికారము ఎట్టి కార్యమైననూ శీఘ్రముగా అగుటకు ఈ మంత్రమును చేయించవలయును.

### 2. మహాపాశుపతాస్త్ర మంత్రము: Maha Pashupata Astra Mantra (To fulfil wishes)

**మంత్రము: క్రాం క్రీం క్రోం ఘ్రుం క ఎ ఇ ల హ్రీం నమశ్శంభవేచ మయోభవేచ నమశ్శంకరాయచ మయస్కరాయచ నమశ్శివాయచ శివతరాయచ॥**

ఈ మంత్రమును 169 రుద్రమంత్రములతో సంపుటీకరించి శివునికి అభిషేకించాలి.

అభిషేక ద్రవ్యములు: పంచామృతములు మరియు ఇతర అభిషేక ద్రవ్యములు.

ఫలము: సర్వ కార్య సిద్ధి, వాంఛితార్థ ఫలదాయిని.

### 3. త్రిశూల పాశుపతము: Trishula Pashupatam (For health problems and protections from enemies')

దీని విధానము మిగతా పాశుపతములకంటే భిన్నంగా ఉంటుంది. దీనిలో మొదట నమకమును, తరువాత పురుషసూక్తమును తదనంతరము చమకమును పఠించిన యెడల ఈ పాశుపత విధానము పూర్తి అగును. ఇది అపమృత్యుహరము.

### 4. అఘోర పాశుపతము: Aghora Pashupatam (For serious health problems)

మంత్రము: ఓం అఘోరేభ్యో2థఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః। సర్వేభ్య స్సర్వ శర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః॥

ఈ మంత్రమును రుద్రముతో సంపుటము చేసి శివుణ్ణి అభిషేకించినచో ఈ మంత్రసిద్ధి అగును.

అభిషేక ద్రవ్యములు: దీనికి పంచామృత అభిషేకముతో పాటు అష్టపుష్పపూజ, క్షీరాన్న నివేదనము చేయవలసియుండును.

ఫలము: అపమృత్యుహరం.

## 5. నవగ్రహ పాశుపతము: Navagraha Pashupatam (For Doshas in Brith chart caused by planets)

**మంత్రము: ఓం క్లీం శ్రీం ఐం హ్రీం గ్లౌం రం హుం ఫట్**

విధానము: పైన ఇచ్చిన మంత్రముతో రుద్ర సంపుటి గావించి శివుణ్ణి అభిషేకించాలి.

అభిషేక ద్రవ్యము: పంచామృతములు, బిల్వపత్రములు, అష్టపుష్పములు, క్షీరాన్నము ఈ అభిషేకమునకు కావలసియుండును.

ఫలము: నవగ్రహ పీడా పరిహారము. జాతకంలోని గ్రహదోష నివృత్తికి, గోచార గ్రహదోష నివృత్తికి ఈ పాశుపత మంత్రము అత్యంత ఫలదాయి.

## 6. కౌబేర పాశుపతము: Koubera Pashupatam (For Financial growth)

**మంత్రము: రాజాధిరాజాయ ప్రసహ్య సాహినే ।**
నమో వయం వై శ్రవణాయ కుర్మహే।
సమే కామాన్కామ కామాయ మహ్యం।
కామేశ్వరో వైశ్రవణో దదాతు।
కుబేరాయ వైశ్రవణాయ మహారాజాయ నమః।

ఈ పై మంత్రముతో 169 రుద్రమంత్రములను సంపుటము చేసిన యెడల కౌబేర పాశుపతమనబడును.

ద్రవ్యము: ఆవునెయ్యి తో అభిషేకము, బిల్వపత్ర పూజ, మౌద్గదన నివేదన

ఫలము: ఐశ్వర్యాభివృద్ధి. ఆర్థిక లాభములు.

## 7. మన్యు పాశుపతము: Manyu Pashupatam (For protections from enemies)

**మంత్రము: సంసృష్టం ధనముభయం సమాకృతమస్మభ్యం దత్తాం వరుణశ్చమన్యుః।**
భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయం ।।

పై మంత్రముతో 169 రుద్రమంత్రములను సంపుటము చేసిన యెడల అది మన్యుపాశుపతమనబడును.

ద్రవ్యము: ఖర్జూర ఫల రసాభిషేకము, జమ్మి పత్రి పూజ, మాషచక్ర నివేదన.

ఫలము: ఈ పాశుపతము వలన శతృబాధానివారణమగును.

## 8. కన్యా పాశుపతము: Kanya Pashupatam (For unmarried boys)

**మంత్రము: ఓం పావీ రవీ కన్యా చిత్రాయుస్సరస్వతీ వీరపత్నీ ధియంధాత్ ।**
**జ్ఞాభిరచ్ఛిద్రగ్ ం శరణగ్ ం సజోషా దురాద్ధం గృణతే శర్మయగ్ ం సత్ ।।**

ఈ మంత్రమును 169 రుద్రమంత్రమంత్రములచే సంపుటితము చేసిన యెడల కన్యాపాశుపతమనబడును.

అభిషేక ద్రవ్యము: పంచదార (మెత్తగా పొడిచేయాలి) అభిషేకము కొరకు, కరవీర పుష్పములు పూజ కొరకు, చక్కెర పొంగలి నివేదన కొరకు.

ఫలము: ఈ మంత్రము వలన ఇష్టకన్యాప్రాప్తి, వివాహము కాని పురుషులకు తొందరగా వివాహం అవటం ఫలములుగా చెప్పబడ్డాయి.

## 9. వర పాశుపతము: Vara pashupatam (For Unmarried girls)

**మంత్రము: ఓం క్లీం నమో భగవతే గంధర్వరాజ విశ్వావసో మమాభిలషితం వరక్షిప్రం ప్రయచ్ఛ స్వాహా।।**

ఈ మంత్రముతో 169 రుద్రమంత్రములను సంపుటితం చేసిన యెడల అది వర పాశుపతం అగును.

అభిషేక ద్రవ్యము: పంచదార (మెత్తగా పొడిచేయాలి) అభిషేకము కొరకు , కరవీర పుష్పములు పూజ కొరకు, చక్కెర పొంగలి నివేదన కొరకు.

ఫలము: ఈ పాశుపతం వలన ఇష్ట వర ప్రాప్తి, వివాహం కాని కన్యలకు శీఘ్రముగా వివాహం అవటం ఫలములుగా చెప్పబడ్డాయి.

## 10. ఋణ విమోచన పాశుపతం : Rina Vimochana Pashupatam (For Finacial problems and coming out from debts)

**మంత్రము: ఆనృణా అస్మిన్ననృణాః పరస్మిగ్గ్ తృతీయే లోకే అనృణాస్యామ। యే దేవయానా ఉత పితృయాణా సర్వాంపథో అనృణా ఆక్షీయేమ।।**

ఈ మంత్రముతో 169 రుద్ర మంత్రములను సంపుటితము చేసిన యెడల అది బ??ుుణ విమోచక పాశుపతమగును.

అభిషేక ద్రవ్యములు: అభిషేకము కొరకు చెఱకు రసం, పూజ కొరకు వాకుడు పువ్వులతో పూజ, ఆవునేయి నైవేద్యం కొరకు.

ఫలితం : ఋణ బాధనుంచి విముక్తి

## 11. సంతాన పాశుపతము : Santana Pashupatam (For Child birth)

**మంత్రము: ఓం కాణ్డాత్కాణ్డాత్ప్రరోహంతీ పరుషః పరుషః పరీ। ఏవానో దూర్వే ప్రతను సహస్రేణ శతేనచ।।**

ఈ మంత్రముతో 169 రుద్ర మంత్రములను సంపుటితము చేసిన యెడల అది బ??ుుణ విమోచక పాశుపతమగును.

అభిషేక ద్రవ్యములు: పంచామృతములు, దూర్వాలు(గరిక) -అభిషేకం కొరకు, బిల్వ పత్రములు, అష్ట పత్రములు-అభిషేకము కొరకు, అపూపములు(అప్పడములు), క్షీరాన్నము నైవేద్యము కొరకు.

ఫలము: సంతాన ప్రాప్తి.

## 12. ఇంద్రాక్షీ పాశుపతము: Indrakshi Pashupatam (For Health problems)

**మంత్రము: భస్మాయుధాయ విద్మహే। రక్త నేత్రాయ ధీమహీ। తన్నో జ్వరః ప్రచోదయాత్ ।**

ఈ మంత్రముతో 169 రుద్ర మంత్రములను సంపుటితము చేసిన యెడల అది ఇంద్రాక్షీ పాశుపతమగును.

అభిషేక ద్రవ్యములు: భస్మము ( భస్మోదకముతో అభిషేకము చేయాలి.) అష్ట పుష్పములు, బిల్వ పత్రములు పూజ కొరకు, మాష చక్రము నివేదన కొరకు.

ఫలితము: నిరంతరము అనారోగ్యములు, జ్వరములతో బాధ పడువారు ఈ పాశుపతము చేసినచో అన్ని రకాల అనారోగ్యముల నుంచి దూరమవుతారని ఫలితము చెప్పబడ్డది.

## 13. వర్ష పాశుపతము: Varsha Pashupatam (For Rains)

**మంత్రము: నమో రుద్రేభ్యో యే దివియేషాం వర్షమిషవస్తేభ్యో దశ ప్రాచీర్దశ దక్షిణా దశ ప్రతీచిర్దశోదీచిర్దశోర్ధ్వాస్తేభ్యో నమస్తేనో మృడయంతు తేయం ద్విశ్మోయశ్చవో ద్వేష్టితం వో జంభే దధామి.**

ఈ మంత్రముతో 169 రుద్ర మంత్రములను సంపుటితము చేసిన యెడల అది వర్ష పాశుపతమగును.

అభిషేక ద్రవ్యములు: పంచామృతములు, నారికేళములు అభిషేకము కొరకు, బిల్వపత్రములు అర్చన కొరకు, క్షీరాన్నము నివేదన కొరకు

ఫలము: ఇది లోక కళ్యాణార్ధము చేయబడే పాశుపతము. సకాల వర్ష ప్రాప్తి, కరువు కాటకముల నివారణ దీని ఫలములు.

## 14. అమృత పాశుపతము: Amruta Pashupatam (For Longevity and overall growth.)

**మంత్రము:ఓం హౌం ఓం జూం ఓం సః ఓం భూః ఓం భువః ఓం స్వః**

**ఓం త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనం ।**
**ఉర్వారుక మివ బంధనాన్మృత్యోర్ముక్షీయమామృతాత్ ।।**

**ఓం స్వః ఓం భువః ఓం భూః ఓం సః ఓం జూం ఓం హౌం ఓం స్వాహా।**

ఈ మంత్రముతో 169 రుద్ర మంత్రములను సంపుటితము చేసిన యెడల అది అమృత పాశుపతమగును.

అభిషేక ద్రవ్యము: అభిషేకము కొరకు పంచామృతములు, పూజ కొరకు బిల్వ పత్రములు.

ఫలము: ఈ పాశుపతము అన్నింటిలోకి ముఖ్యమైనది. ఇది అపమృత్యు హరము. సకల ఐశ్వర్య ప్రదము.